# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక.

సంపుటి 44 మన్మథ సంవత్సరము - ఆశ్వయుజ, కార్తిక మాసములు - సంచిక-4

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౪ } మన్మథ సంవత్సరము ఆశ్వయుజ-కార్తికమాసములు } సంచిక

## ప్రామాణిక భాష

ఈ నడుమ పత్రికలలోఁ బ్రామాణిక భాషనుగూర్చి కొంత దుమారము రేఁగుచున్నది. ఈ సంవత్సర ఫల మెట్టిదో గాని యుగాదినాఁడే యిట్టి దుమారము భయంకరముగా రేఁగెను. చినుకులు లేకుండ దుమారమే హెచ్చుగా నుండుట యిందు విచారింపఁదగినది. నిజముగా సాహిత్య వివాదములకుఁ బత్రికలు స్థానమిచ్చి ప్రజలలో సాహిత్యాభిరుచి కలుగఁ జేయుట సమంజసమే. కాని అట్టి వాని నుదారముగా గ్రహించుట పత్రిక గౌరవమునకుఁ గారణ మగును గాని నష్టముకాదు. ఈ చర్చల నూరక పొడిగింపక నామరూపములు గలవారి యభిప్రాయములమాత్రమే గ్రహించి యీ వివాదము నంతటితో విరమించుట భాషకు నిజమైన యుపకారముచేయుటయే. అట్లుగాక కానవచ్చిన వాని యభిప్రాయము నెల్లఁ గ్రోడీకరించుట వలన నేమి ప్రయోజనము? సారస్వతమున విషయ నిర్ణయము ప్రజాబాహుళ్యాభిప్రాయములఁబట్టి జరుగదు గదా! అది యెప్పటికిని సహృదయుల సమ్మతిని బట్టి జరుగుచుండుట సారస్వతాభిమానులకు సువిదితమే.

ఇఁకఁ బ్రామాణిక భాషను గూర్చి చూతము. ప్రామాణిక భాష యనఁగా (1) ప్రమాణములవలన సిద్ధించిన భాష. వ్యాకరణము, నిఘంటువును బ్రమాణములు. శబ్దసాధుత్వాసాధుత్వ నిర్ణయ మొనరించునవి యివియే గదా! అట్టి వ్యాకరణాదులవలన సిద్ధించిన సాధు శబ్దములతోఁ

గూడిన భాషయే ప్రామాణిక భాష యనఁబడును. (2) ప్రామాణి కులు ప్రయోగించిన భాష, శబ్దముల సాధుత్వాసాధుత్వము లెఱింగిన యుత్తమ కవులు వ్రాసిన కావ్యములుగూడఁ బ్రామాణిక భాషయే. తేలిన సారాంశ మేమనఁగా వ్యాకరణ నిఘంటువులచేత నిర్దిష్టములై మహాకవులచేఁ బ్రయోగింపఁబడిన పదజాలము గల భాషయే ప్రామాణిక భాష యని యర్థము.

మొదట మహాకవులు తమ కాలమున వ్యవహార సిద్ధమైన భాష నుండి సాధు శబ్దముల గ్రహించి కావ్యముల రచించిరి. ఆ కావ్యముల యందలి పదముల నన్నిటిని విభజించి వైయాకరణులు సూత్రము లొన రించిరి. ఈ వ్యాకరణాదులు తరువాతి కవుల కావ్యరచన కాధారము ల య్యెను. ఈవిధముగా మహాకవుల ప్రభావము వ్యాకరణముల మీఁదను, వ్యాకరణముల ప్రభావము మహాకవులమీఁదను గన్పట్టును. ఇందు నన్యోన్యాశ్రయము తప్పదు. కాని మహాకవులు నిరంకుశు లగుటచే వ్యాకరణము నుల్లంఘించి,నాఁటి భాషా స్వరూపము ననుసరించి,స్వతంత్ర ప్రయోగములఁ గావింతురు. "నిరంకుశాః కవయః" అన్నారు గదా యని నేడు గణయతిప్రాసల నేర్చుకొనినవాఁడు గూడస్వతంత్ర ప్రయో గములఁ జేయఁబూనిన హాస్యాస్పదుఁ డగును. సిద్ధహస్తులైన కవులకే యీ స్వాతంత్ర్యము చెల్లునుగాని సాధారణుల కది చెల్లదు. కొన్ని యెడల వ్యాకరణములు మహాకవుల ప్రయోగములను గూడ స్వీకరింపక పోవచ్చును. మహాకవులైనను వారు ప్రయోగించిన విరుద్ధపదము ల న్నియు సాధువులుగా స్వీకరింపఁబడ జాలవు.'షేక్స్పియరు' ప్రయోగిం చిన శబ్దము లన్నిటిని నాంగ్ల వ్యాకరణములు ప్రమాణములుగా స్వీక రించుట లేదుగదా! ఒక మహాకవి ప్రయోగించిన విరుద్ధ ప్రయోగ మును దరువాతి వారుఁగూడఁ బ్రయోగించుచు వచ్చినచో నది సాధు వుగాఁ బరిగ్రహింపఁబడును. ఈవిధముగా మహాకవి ప్రయోగములఁ బట్టి

వ్యాకరణము మాఱుచుండును. వ్యాకరణము ననుసరించి మహా
ప్రయోగము లేర్పడుచుండును. భాష యభివృద్ధి చెందుచున్నకొ
యీ మార్పు కవుల ప్రయోగములలోఁ వ్యాకరణములలోఁ గాన్పించు
కాలక్రమమునుబట్టి భాషలో నీ మార్పు సహజముగా జరుగు
యుండును. నన్నయ నాఁటి భాష తిక్కన నాఁడును, తిక్కన నాఁటి
పెద్దన నాఁడును, ఆఁనాఁటి భాష యీ నాఁడును మార్పు చెందుట
నిదర్శనము. ఆనాఁడు వ్యాకరణములు లేకపోలేదు. కవులు వ్యాక
ముల ననుసరింపక పోవను లేదు. ఇట్లున్నను భాషయందు నాఁటినా
మార్పు కానవచ్చుచునే యున్నది. మార్పు భాషకు స్వతస్సిద్ధము
బలవంతముగా భాషలో మార్పు దెచ్చుటకై ప్రయత్నించుట య
సరము. అసహజము.

నేఁడు చాల మంది కవులు స్వేచ్ఛగా నసాధు ప్రయోగము
గావించుచున్నారు. వ్యాకరణములుగూడ సర్వజనీనములును, స
త్వార్హములైన శబ్దముల సాధింపలేక యున్నవి. అనఁగా వ్యాకరణము
మన భాషకు సమగ్ర వ్యాప్తములు గాకున్నవి. వ్యాకరణము లస
గ్రములు గావున వానిఁ బాటింప నవసరము లేదని తమ యిష్టము వ
నట్లెల్ల నపప్రయోగములఁ గావించుట "మూలచ్ఛేదీ తవ పాండి
ప్రకర్ష" యగును. మనకుఁ దోఁచినట్లెల్ల నుచ్చావచముగా శబ్దము
బ్రయోగించినచోఁ జదువుకొన్న వాని కన్నఁ జాకలివాఁడే మేలగు
అప్పుడు నిరంతరాయాసపాధ్యమైన విద్యాసంస్కారమే యనవస
మగును. కావున మనుజునకు నీతినియమము లెట్లవసరములో భాష
గూడ నీతినియమము లట్లే యవసరములు.

వ్యావహారిక వాదులు భాషకు నియమ మవసర మని గ్రహించు
ముదావహము. కాని వా రొకవంక భాషకు నియమ మవసర మ
చెప్పుచు వేఱొక వంక "వ్యావహారిక భాష సర్వత్ర పరిగృహీ

మయ్యె ననియుఁ విశ్వవిద్యాలయములలోఁ గూడ బరిగ్రహింపఁబడినచోఁ గృతకృత్యులము కాఁగల"మనియు భావించుచున్నారు. భాషాపరిశ్రమ మవసరము లేక తోఁచినట్లెల్లఁ బ్రయోగించుట కనుకూలముగా నుండుటచే వ్యావహారిక భాష నితరు లంగీకరించిన నంగీకరింతురు గాని విద్యావేత్తలచేఁ బాలింపఁబడుచు, నున్నతవిద్యాశిక్షణ మొసంగు విశ్వవిద్యాలయము లనుగతి గలిగియుండుట కవకాశము లేని వ్యావహారిక భాష నంగీకరింప వనియే మా యభిప్రాయము. భాష కనుగతి వ్యాకరణమూలము. నేఁటి వ్యావహారిక భాష కే వ్యాకరణమును బ్రమాణము కాదు. వారు వ్యాకరణమును బ్రమాణముగా నంగీకరించుచో మాకును వారికి నభిప్రాయ భేదమే లేదు. నేఁటి వ్యాకరణము లసమగ్రము లన్నచో సర్వసమ్మతము సమగ్రము నగు వ్యాకరణ రచనమునకై కృషి యొనర్చుట తగవు కాని యున్న నియమముల నుల్లంఘించుట తగదు. సర్వసమ్మతము, సమగ్రమునైన వ్యాకరణ మవసర మని పరిషత్తు చిరకాలమునుండి తెలుపుచున్నది. వ్యాకరణము సర్వసమ్మతము సమగ్రము కావలె నన్నచో నాంధ్రదేశమునఁ గల వైయాకరణులు, సుప్రసిద్ధ కవులు, భాషాశాస్త్రజ్ఞులు నొక సంఘముగా నేర్పడి దానికై కృషి చేయవలెను. గత సంవత్సరము పరిషత్తీ విషయమై కొంత కృషి యొనర్చెను. కాని కార్యము బహుజన సాధ్య మగుటచే ముందునకు సాగలేదు. మన ప్రభుత్వము, విశ్వవిద్యాలయములు, భాషాసంస్థ లన్నియుఁ గలిసి గట్టి కృషి చేసినచో నీ ప్రయత్నము సుకరము కాఁగలదు. అప్పుడు భాషావిషయమున నెవ్వరికి నభిప్రాయభేదములు లేక యేకముఖముగా భాషాభివృద్ధికై కృషి జరుగఁగలదు. "దేశభాషలయందుఁ దెలుఁగు లెస్స" యనుసూక్తి తథ్యము కాఁగలదు.

—

# శ్రీమద్రామాయణము-మానవత్వప్రతిష్ఠ

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

అనఁగా "ఇట్టి వాక్ప్రమాదములు కేవలము పొరపాటువ
సంభవించినవి మాత్రము కావు. అవ్వియవి సకారణముగ నాలోచి
బడిన విషయములవలనఁ బుట్టినవే. వాని కర్థము లేకపోలేదు. అయ
సమానప్రతిపత్తి గల రెండు మనోభావము లొండొంటితో సవి
తము లగుటవలననో, అంతకన్న ముఖ్యముగ రెండు విరుద్ధ భావ
లొకదానితో నొకటి సంఘర్షణ మొందుటవలన యనుట లెస్సకా
నట్టి సందర్భమువలననో, యట్టి స్ఖాలిత్యము లేర్పడుచుండును" అనివ్రా
"సర్వసాధారణమగు వాక్స్ఖాలిత్యమున మనకు విస్పష్టముగ గ
రించున దేద్ది యన, మన ముద్దేశించిన విషయమునకుఁ బూర్తిగ
రిక్తమగు మాట మన నోటినుండి జాఱుట", అనిగూడ ననెను.
మా మునిపుంగవుని జీవితమును గమనించినచో నాతనికి సహచరి
యుండిన బోయవనిత తా నొనరించెడి పాతకములను బంచుకొన
కీవఱకు నిరాకరించియుండెను. దాని దుస్సాంగత్యమువలననే యా
డట్టి దారిదోపిడీవృత్తికి దిగియుండె ననుట తప్పుకాదు. అ
యాతని నిరాకరించెను. అట్టి బోయతపీడ తనకు వదలించినది 'తా
మంత్ర జపము. తారకమంత్రమునకు శ్రీ రామచంద్రుఁ డధిదైవ
కదా ! కావున నాతఁ డుత్కృష్ట మగు నా తారకమంత్రప్రభావంబ
మహత్తరరామభక్తుఁడై నిరంతర మిష్టదైవోపాసన మొనరించుచు
ననుట సత్యదూరముకాదు. నారదాదులు భక్తిగూడ నొక విధమ
కామస్వరూప మని నిర్ధరించిరి. "సా త్వస్మిన్ పరమప్రేమరూపా" య
నారదుఁడు తన ప్రథమభక్తి సూత్రమునఁ బేర్కొనెను. అందుల
ప్రమాణముగ "యథా వ్రజగోపికానా"మ్మని గోపికాస్త్రీల నాడ

ముగ నొసంగియున్నాఁడు. అంతటితో నూరకొనక "తదర్పితాఖిలా చారస్సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్" అని చెప్పుటచే భక్తుఁడు తనకు సంభవించిన కామక్రోధాదికమానసికోద్రేకములు తనవలన నారాధింపఁబడెడి యిష్టదైవమునందే పర్యవసింపఁ జేయవలె నని హెచ్చరించియుండెను. రామదాసు తన ప్రాణము విసిగి కోపము వచ్చినతఱి "సీతమ్మకు చింతాకు పతకము చేయించితి నది నీ యబ్బసొమ్మనుకొంటివా !" యని శ్రీరామచంద్రునిగూర్చి కఠినముగాఁ బలికిన ట్లాతని కీర్తనలయందుఁ గలదు. కావున నా మహత్తరభక్తియోగి యగు వాల్మీకికిఁ దా నీవలకు గామవిమోహితుఁడై బోయవనితవలలోఁ దగులుకొనిన దుర్గతినుండిఁ దప్పించిన పరిపూర్ణ విశ్వాసమా రామునియందుఁ గలదు. అదియే యతని హృదయమున నిరంతరము ప్రవహించెడి కృతజ్ఞతాసూచక మగు నానందము. అతఁడు తమ నాతీరమునందలి వనసంచారమున నాయానందములో నిమగ్నుఁడై యే ప్రవర్తించుచుండెను. అంతటఁ గ్రౌంచమిథున మాతని కంటఁబడి పూర్వస్మృతి కలిగించి యాతని హృదయమందలి కామబీజము నుద్రేకింపఁ జేసెను. దానివలన తన సహజభక్తిధోరణి యడుగుతగిలి విషయానందస్ఫురణము కలిగెను. విషయానందముగూడ బ్రహ్మానందాభాసమే యని విద్యారణ్యులీ తీరునఁ దమ పంచదశియందు వివరించిరి.

శ్లో॥ "ఏషోఽస్య పరమానందో ఽఖండైకరసాత్మకః।
అన్యాని భూతాన్యేతస్య మాత్రామేవోపభుంజతే॥
(పంచదశి_విషయానంద ప్రకరణము)

కావున నా రెండిటికిని సన్నిహిత సంబంధ ముండుటచేఁ దన కీవలకుండిన రాక్షస ప్రవృత్తిని నశింపఁజేసినందునఁ దా నప్రయత్నముగ నుచ్చరించిన 'అవధీః' యను పదము తనయందే పర్యవసించెను. ఇఁక బోయ వనిత తనను భ్రష్టు మొనరించిన దగుటచే నా బోయవానిపైఁ గోపము

కలిగెను గాని యా ఋషి యొక్క పరమసాత్త్విక హృదయము వా
శాపదగ్ధము సేయుటకు మాఱుగ నాతని నోరు జారించి పైఁగ స్త్ర
వాక్యముగఁ బలికించెను ! అవియే యా శ్లోకమునందలి మానవ స
మగు నైజప్రవృత్తి.అందుచే నయ్యది బ్రహ్మవలనఁ బ్రబోధింపఁబడువ
తా నా రీతి మంగళ వాక్యము పలికిన బ్లాతిఁడెంచి గుర్తెఱింగియు
లేదు! దీనికి "Freud" మహాశయుఁడు "The forgetting of impr
sions and experiences shows the working of the tendency
ward off from memory that which is unpleasant," అని
యున్నాఁడు. క్రౌంచమిథునసందర్శనముచే సంభవించిన దన పూ
విషయవాసనాస్మృతియు బోయవానిం జూచుటచేఁ దనను బూ
మధోగతిపాలు గావింప సమకట్టిన బోయవనితయు నాతనికి హృద
వేదనము రగులు కొలిపెను. అందుచే నాతఁ డేమని శపించెనో గు
నెఱుంగఁడు."సమాజ్యోగే"యను పాణిని సూత్ర మాతనిని రక్షించె
యాతనికిఁ దోఁపలేదు! దానిని బ్రహ్మగారు విప్పి చెప్పిన యనంతర
తన హృదయమును బదిలపఱచుకొని యా బోయవాఁడు శ్రీరామచంద్ర
డనియు క్రౌంచమిథున ముపలక్షణముగా (తానును బోయతేయని
దప్పుకాదు) బ్రహ్మగారు రావణమందోదరు లని సూచించుటచే ద
నంగీకరించి నారదవచనములను దలంచి బ్రహ్మోపదేశమును సం
రించి:—

> శ్లో॥ ఉపస్పృశ్యోదకం సమ్య ఙ్మని స్థిత్వా కృతాంజలిః।
> ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేష తే గతిం॥"
> "పురాయత్తత్ర నిర్వృత్తం పాణా వామలకం యథా।
> తత్సర్వం తత్త్వతో దృష్ట్వా ధర్మేణ స మహాద్యుతిః॥"
> "అభిరామస్య రామస్య చరితం వక్తు ముద్యతః
> కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తరం".

(రామాయణవ

ఆ తీరున శ్రీరామవృత్తాంత మంతయు "కామార్థగుణసంయుక్తం ధర్మార్థగుణవిస్తర"ముగ, కరతలామలకముగ ప్రసన్నమొనరించికొని కావ్యపరమార్థములలోఁ బ్రధానము లగు "శివేతరక్షతి" "సద్యఃపరనిర్వృతి"ని దనకును లోకమునకును సాధించెను ! ఇఁక నాతనికి శ్రీరామ చరిత్ర తప్ప తదితరులైన యిక్ష్వాకు, రఘు, మాంధాతాదు లేందులకు ?

ఇంక నొక చిన్నవిషయమును పాఠకమహాశయులకు సూచించి వాల్మీకి వృత్తాంతము నింతటితో ముగింతును. వాల్మీకి శాపవాక్యమున పదునొకండు శబ్దములమాత్రమే గలవు. నారదుఁడు తన భక్తిసూత్రములయం దేకాదశవిధభక్తిని నిరూపించెను. వాల్మీకి శ్రీమద్రామాయణమునందా పదునొకండు విధములగు భక్తిని ప్రదర్శించి యట్టి భక్తులే తీరున పరమధర్మమును సాధించి లోకధర్మమును నిర్వర్తించిరో సువిపులముగ వివరించెను. ఆ పదకొండువిధము లగు భక్తిని సుదాహరించి యా ఋషి; శ్లోకమునందలి పదకొండు శబ్దముల నేరీతి నయ్యవి సంబంధించునో దిఙ్మాత్రముగ సూచించుచున్నాను.

1. మానిషాద-గుణమాహాత్మ్యాసక్తి
2. త్వం - స్వరూపాసక్తి
3. ప్రతిష్ఠాం - పూజాసక్తి
4. శాశ్వతీః - స్మరణాసక్తి
5. సమాః క్తి- సఖ్యాసక్తి
6. అగమః - దాస్యాసక్తి
7. యత్ - వాత్సల్యాసక్తి
8. క్రౌంచమిథునాత్-కాంతాసక్తి
9. ఏకమ్ - ఆత్మనివేదనాసక్తి
10. కామమోహితమ్ - తన్మయాసక్తి
11. అవధీః - పరమవిరహాసక్తి

ఈతీరున నాకు స్ఫురించిన విధమున,నారదుఁ డొనరించిన భక్తివిభాగము ననుసరించి సూచించితిని. బుద్ధిమంతు లగువార లితోధికముగ సాధింపఁగలరు. రామాయణ మహార్ణవములో నెందఱెన్ని రత్నములు దొరకవు? పైనఁ జేర్కొనఁబడిన యేకాదశవిధభక్తిని యెవ్వని

నెందులకు ప్రమాణముగ వాల్మీకి నిరూపించెనో గూడ నాకుఁ దో
విధమున పాఠకుల యెదుట నుంచెదను.

1. దశరథుడు - మోహాసక్తి.
2. లక్ష్మణుడు-గురుమాహాత్మ్యాసక్తి. (గుణైర్దాస్యముపాగతః
   యతఁడే చెప్పుకొనెను).
3. భరతుడు - పరమవిరహాసక్తి.
4 శత్రుఘ్నుడు - స్మరణాసక్తి
5. కౌసల్య - వాత్సల్యాసక్తి
6. సుమిత్ర, జనకుడు - పూజాసక్తి
7. సీత - కాంతాసక్తి - (సీత - ఉత్తమస్థాయి, శూర్పణఖ -
   స్థాయి యని చెప్పిన తప్పుకాదు)
8. ఆంజనేయులు - దాస్యాసక్తి (దాసోఽహం కోసలేంద్రస్య
   యతఁడే యనెను).
9. సుగ్రీవ - విభీషణులు - సఖ్యాసక్తి - లేక శరణాగతి
10. జటాయువు.<br>శరభంగుడు.<br>శబరి. } ఆత్మనివేదనాసక్తి
11. వసిష్ఠుడు<br>విశ్వామిత్రుడు } తన్మయాసక్తి

ఈవిధముగ వాల్మీకి తన కృతియం దత్యుత్తమస్థాయిని
నాచరించిన యేకాదశవిధభక్తిని వారివారియందు మూర్తీభవి
జేసి శ్రీరామచంద్రుని నవవిధరస స్వరూపుఁ డగు పరమాత్మ
వర్ణించి తనహృద్గతకామబీజమును భగవంతునియందుఁ బర్యవసి
జేసెను ! కృష్ణ పరమాత్మ "విదుషాం కి మశోభన"మ్మని మహా
కర్షియు నశుభము చెంద దని వక్కాణించెను. కావున మహర్షి వ

గు "మానిషా" దేతి శ్లోకమునం దింకను విశేషార్థములు నెక్కువగ
శ్రీమద్రామాయణార్థ ప్రతిపాదకములు కలవు. వాని నన్నిటిని విన
ంచుటవలన గ్రంథవిస్తర మగును. కావున బుద్ధిమంతు లగు పాఠకుల
వి వదలుచున్నాఁడను. ఇరువదినాలుగువేల శ్లోకములు, నిరువది
నాలుగు గాయత్రీ బీజములు, నిరువది నాలుగు తత్త్వములు, నిరువది
నాలుగు ప్రధానపాత్రములు, నా కవిబ్రహ్మ శ్రీమద్రామాయణము
ందుఁ బ్రతిపాదించె ననికూడఁ బాఠకులకు విజ్ఞప్తి సేయుచు భవభూతి
వాక్యముల నుదాహరించుచున్నాను.

శ్లో॥ "లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే।
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి"॥
(ఉత్తర రామచరిత్ర).

## శ్రీ రాముఁడు.

వాల్మీకిశాపవాక్య మొక మంగళాశాసనముగఁ బరిణమించె
ననియు, నయ్యది యా వాల్మీకి హృదయమునందు నిబిడీకృతమై నిరంత
రానుసంధానముచేఁ బూర్తిగ నాతని మానసము నావరించియుండిన
పరమపవిత్రభావ విశేష మగు ననన్యభక్తియు, నందు, క్షీరమక్షీ శా
ర్యయంబున నాతని మానసమందు డాఁగియుండిన సూక్ష్మతర కామ
బీజ ముద్గతమై యాతని కొక శృంగారరసాభినివేశము కలిగించె ననియు,
వి రెండును శ్రీమద్రామాయణమునకుఁ బ్రధానకారణము లని పేర్కొ
నియుంటిని. సహజ సాత్త్వికస్వభావుఁ డగు నా దేవ క్షత్రియునకుఁ గ్రౌం
చమిథునవిపర్యయముచేఁ గలిగిన కరుణారస మంతయుఁ దన పూర్వ
జీవిత స్మృతిజన్య విషాద సమ్మిళిత మని గూడ సూచించియుంటిని. ఆ
తిగ వివిధ రసభావజన్యమైన యుద్వేగముచేతనే యాతని కట్టి వాక్
ప్రాలిత్యము కలిగె ననిగూడ సహేతుకముగ నిరూపించి యుంటిని. ఇఁక
కొక్క విషయమునుగూడఁ బాఠకులకు విజ్ఞప్తి యొనరించుటకై మఱలఁ

గొంత నా సందర్భమును బునరావృత్తి మొనరించుట యావశ్యక మైనది. ఏల యన ఋషి యగు వాల్మీకి యొక్క పక్షిద్వంద్వముయొక్క రతిని గాంచి కామోద్రిక్తుఁ డయ్యె ననుట సమంజసమా యనియు, నట్టి తిర్యగ్జీవి రతి సందర్శనముచేఁ గలిగిన రసోద్రేకము రసాభాసము కాదా యనియుఁ గొందఱు లూహింపవచ్చును. ఆ విషయమునఁ గొంత సమాధాన మవసర మగుటచే యథాశక్తిగ నిట నా వాదసామరస్యమును సప్రమాణముగ నిరూపించుచున్నాను. అందులకు ముందుగ రసాభాసమునుగూర్చి చర్చించుటకుఁ బూర్వము రస మనఁగా నేమియో యొక్కింత మనము తెలిసికొనవలసి యున్నది.

ఆలంకారిక శ్రేష్ఠులలో నొక్కఁ డగు పండితరాయలు తన రసగంగాధరమందు రస నిర్వచన మీ రీతి నొనరించి యున్నాఁడు:—

“సముచిత లలిత సంనివేశచారుణా కావ్యేన సమర్పితైః
సహృదయ హృదయప్రవిష్టైస్తదీయ సహృదయతాసహకృతేన,
భావవిశేషమహిమ్నా విగళిత దుష్యంత రమణీయత్వాదిభిః
అలౌకిక విభావానుభావ వ్యభిచారి శబ్దవ్యపదేశ్యైః
శకుంతలాదిభి రాలంబనకారణై శ్చంద్రికాదిభి రుద్దీపనకారణై ర
శ్రుపాతాదిభిః కార్యై శ్చింతాదిభిః సహకారిభిశ్చ సంభూయ
ప్రాదుర్భావితేనాలౌకికేన వ్యాపారేణ తత్కాలనివర్తితానం
దాంశావరణాజ్ఞానేన ఏవ ప్రమృష్ట పరిమిత ప్రమాతృతాది నిజ
ధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానం
దేన సహగోచరీ క్రియమాణః ప్రాగ్వినివిష్ట వాసనారూపో రత్యా
దిరేవ రసః”.

ఇందు “అలౌకికేన వ్యాపారేణతత్కాలనివర్తితానందాంశావరణాజ్ఞానేన ఏవ... వాస్తవేన నిజస్వరూపానందేన సహగోచరీ క్రియమాణ ప్రాగ్వినివిష్టవాసనారూపో రత్యాదిరేవ రసః” యని యా పండితుఁ

నుదాహరించుటచే, "నలౌకిక"మై, "తత్కాలనివర్తితానందాంశావరణా
జ్ఞాన"ము కలిగి "వాస్తవ"మైన నిజస్వరూపానందములో "సహచరిం
చెడి "ప్రాగ్వినివిష్ట వాసనారూప"మగు "రతి"యే "రస" మనుటలో,
నిందుపారలౌకిక రసానుభూతియొక్క యంశము లౌకికమన మని తప్పక
గోచరింపకమానదు. ఏలన, పారలౌకికానందమునం దంశావరణాజ్ఞా
నము నివర్తింపఁబడుట జరుగదు. అయ్యది తాత్కాలికము కాదు.
అయ్యది తైలధారావతుంగ నేకమై నిత్యమై యావరణ జ్ఞాన రహితమై
ప్రసరించుటంజేసి యయ్యది బ్రహ్మానంద మగుచున్నది. ఇఁక లౌకికా
నంద మనుభవించు నప్పు డన్ననో "సాభిమానజా నేతత్" యను యద్వ
యభావ మేర్పడినను నయ్యది క్షణభంగురమై యనఁగాఁ దాత్కాలికమై
ద్వితీయవస్తువుయొక్క యాలంబనముచేఁ దన కట్టిసౌఖ్యము, లేక యానం
దము కలిగె నను స్మృతి, వెంటనే తోఁచి మఱల తన కట్టి యానందా
నుభవమున కావస్తుసాహాయ్యము నపేక్షించుట తటస్థించుచున్న దనుట
సర్వవిదితము కదా! కావున నట్టి లౌకికానందము సంసృతికి దారితీసి క్రమ
క్రమముగ దుఃఖహేతు వగుచున్న దనుట సర్వశాస్త్రసమ్మతము. కాని
యట్టి సంసృతియందుఁగూడ యద్వయానందము కలిగిన స్త్రీ పురుషు
లిరువురుమాత్ర మొకరినొకరు విడిచియుండుట కొప్పుకొనరు. అందు
స్త్రీ యానందము న్యూనమైనను, పురుషానందము న్యూనమైనను భావ
సంచలనము కలిగి స్వచ్ఛ మగునట్టియు, నిరవధిక మగునట్టియుఁ బ్రేమ
మట్టి మిథునమునందుఁ బ్రసరించుట తటస్థించదు. దానికి వాల్మీకియు
బోయితయే దృష్టాంతము. నిజ మగు నకృత్రిమ ప్రేమ మా బోయితకు
వాల్మీకి దెస నుండెనేని యామె యాతని పుణ్యపాపములలోఁ దనకు
నిమిత్తము లే దని చెప్పఁగలదా? శ్రీరామచంద్రుఁడు తాపసులను
రక్షింతునని చేసిన వాగ్దానమునకై సీతామతల్లి తన సర్వస్వము
త్యాగ మొనరించెను! అదియే "అశిథిల పరిరంభ వ్యాపృతైక

కదోష్ణః'' అని భవభూత్యాదులు గ్రహించిన యద్వితీయప్రేమ లక్షణ
అట్టి రసలేశమునే యానాఁడు వాల్మీకి యా క్రౌంచమిథునమునందు ద
చెను. లేనిచో నొక పక్షి-యేకభర్తృ నియమము సృష్టియందే లే
విహంగము, పురుషపక్షి చచ్చినప్పుడు బోయవాఁ డచ్చట మృత్యువు
నింక నున్నప్పుడా పురుషపక్షికై పలువిధముల సతికరుణముగ నే
టేల తటస్థించును? కావున స్వచ్ఛ మగు ప్రేమరసానుభవ మెకిం
వారి దాంపత్య మనన్యసామాన్యము. ఇందుఁ బురుషునికన్న స్త్రీయ
యా ప్రేమరసము స్వచ్ఛతర మని వాల్మీకి నిర్ణయించెను. చూడుఁ
శ్రీరాముఁ డరణ్యములందలి లేడులను నెమిళ్లను నితరపశుపక్ష్యాదుల
గాంచి యనేకవిధముల మన్మథసంతాపము నొందినటుల వాల్మీకి వ
చెనే గాని సీతవిషయమై చూడఁగ:—

"నైషా పశ్యతి రాక్షస్యో నేమాః పుష్పఫలద్రుమాన్।
ఏకస్థహృదయా నిత్యం రామ మే వానుపశ్యతి॥''

"సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః।
సంకల్పహయసంయుక్తైః యాంతీవ చ మనోరథైః॥''

(రామాయణము సుందర కాం

ఇత్యాదిగఁ గేవల శ్రీరామచంద్రబద్ధహృదయయై యుండె నని చెప్ప
ఇందుఁ బరమార్థ మేమి? ఈశ్వరచైతన్య మన్నిటియందును బ్రతి
బించుచు నేనిముందును సక్తము కాదు. కాని ప్రకృతి కటులగా
నీశ్వరచైతన్యస్పర్శ లేనిచో నయ్యది నశించును. అందుచే సృష్టియందు
బురుషనిష్ఠ మగు కామ మితరత్ర వ్యభిచరించుటయు, స్త్రీనిష్ఠ మ
కామము తాను వరించిన, లేక, వలచిన పురుషునియందే నిష్ఠిత మ
టకును గారణ మని నా యభిప్రాయము. జానకి తా నరణ్యమున
వచ్చునపుడు "యా స్త్రీ యస్యాద్భి ర్దత్తా ప్రేత్యభావేపి తస్య సా
యనుటచే నందలి రహస్యము, స్త్రీ ప్రకృతిచేతనే భర్తృనిష్ఠ నై

స్వభావము కలది. ఆమె కితరత్రి యునికి యసంభవము. పురుషాళో
యము లేక స్త్రీ శోభింపజాల దని పెద్ద లనుటకుఁగూడ కారణ మద్దియే!
ఇఁకఁ బురుషునకో? ఆతనికి రెండే రసానుభూతిమార్గములని భర్తృహరి
అభినవమదలీలాలాలసం సుందరీణాం| స్తనభరపరిఖిన్నం యౌవనం
వా వనం వా' అని సూచించియున్నాఁడు! విషయానందమా? లేక
బ్రహ్మానందమా! యని చెప్పెను. కావున నట్టి బ్రహ్మానందాంశ మైన
విషయానందము లౌకికరస మగుచున్నది. ఇయ్యది మేఘమం దుండిన
స్వచ్ఛనీరము, క్రిందకు దిగినకొలంది సాంకర్యమును జెంది లోకప్రవా
హముచే మలిన మైనటుల నిర్దుష్టము లగు మిథునములందుఁ బ్రవహిం
చెడి శృంగారరసము మలినమై రసాభాస మగుచున్నది! పైనఁ జెప్పఁ
బడిన పండితరాయులే యిట్టి రసాభాసమును నిర్వచించుటలో నీ
తీరున సూత్రించెను. "అనుచితవిభావాలంబనత్వం రసాభాసత్వం" ఇఁక
విద్యానాథాదులు 'ఏకత్రైవానురాగ శ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా"
యని మూఁడువిధములుగ విభజించిరి. ఏ మైన నేమి? పర్య
వసానమున ననుచితవిభావాలంబనాదులచే రసాభాసము కలుగుచు
న్నది. ఈ లోకప్రవాహమునందుఁ జరించు జీవులం దేది యుచితము?
ఏది యనుచితము? ఏకత్రానురాగము గాక నిరువురయందును బరి
పూర్ణ మగు ప్రేమరసము ప్రవహించుచున్నదా? ఈ తీరున మనము
విమర్శింపఁగడంగుచో, బ్రహ్మాదులు మొదలు పిపీలికమువఱకు నీ లోక
మునం దెచ్చటఁ జూచిన నుచిత మగు రసానుభూతి మృగ్య మని చెప్ప
తప్పదు। అందువలననే దేవతలు, రాక్షసులు, దుర్మార్గులు, సన్మా
ర్గులు, పుట్టుట తటస్థించుచున్నది! స్త్రీ, పుం, సంయోగఫల మానం
దము. అట్టి యానందమునుండియే జగము సృజింపఁబడుచున్న"దని
ఆనందాదేవ ఇమానిభూతాని జాయంతే' త్యాదిగ శ్రుతి చెప్పుచు
న్నది. కావున నిర్దుష్ట మగు సంతానము కలుగుటకును, లోకము భ్రష్టము

కాకుండుటకును వేదశాస్త్రపురాణాదులందును వాత్స్యాయనాది
తంత్రములందును నే యేమానవులే తీరున బ్రవర్తింపవలెనో ని
చిరి. స్త్రీ పురుషప్రకృతులయందు భిన్నత్వ మేర్పడినంగాని బ
కాల, దేశ, పాత్రానౌచిత్యముచే గాని రాక్షసులు పుట్టుదు
రావణజన్మవృత్తాంతము మనకు బోధించుచున్నది. సర్వసాధ
ముగ లోక మంతయు రసాభాసానందమయ మగుటచే శ్రీ సీ
ముల నిర్దుష్టానందమును వాల్మీకి వర్ణింప సమకట్టియే తన కా
నారంభించెను!

పశుపక్ష్యాది శృంగారరసానుభూతిచే గామోద్దీపనము కల
గూడ స్వభావవిరుద్ధము గాదు. బ్రహ్మాదిస్థావరపర్యంత మీ
రసము సర్వవ్యాపకత్వము నొందియున్నది. "ఋషీణా మ
ప్రవహతిహి మోహాయ జగతామ్" అని శ్రీశంకరభగవత్పాదులు
నటుల నది యెవ్వరి నాకర్షింపదు? నిర్దుష్ట మగు బ్రహ్మానంద
భూతి నొందెడి కాలమందుగూడ నట్టి రసవిచ్ఛిత్తికి గారణము
వారిని శపించినటుల, విశ్వామిత్ర, అగస్త్య, నారదాదిమహర్షులచారి
లందుగానవచ్చుచున్నది. ఇక రసాభాసవిషయములందుమాత్ర
తగులువారిని శపించు వేల తటస్థింపదు? పైగ దానివలన క్రోధ
వించి జంతువుల ననేకక్రూరమారణకర్మలపాలు చేయు ననుట,
రావణ, అహల్యాదులవృత్తాంతములు మనకు బోధించును. క్రో
రసవిశేషము లన్నియు నొక్క కామవిచ్ఛిత్తి, యనగా, శృంగ
విచ్ఛిత్తిచే గలిగినవేగాని వేఱొండు కా దనుటకు మనకు శ్రీమ
మాయణము లక్ష్యగ్రంథము. ఈ తీరున జూడజూడ నే
వస్త్వంతరాపేక్షచేగాని యనుభూతము కాదో యది యెల్ల ర
నమే యని మనకు దోపకమానదు! ఏలయన, రెండవవస్తువు
యపేక్షచే గలిగిన రసమునకు విచిత్తి యేర్పడుట తప్పదు. ర

త్తిచే హృదయమునం దావేదనము జనించి దానివలన మనస్సున కుల్లాసము నానందము చెడి క్రమక్రమముగ మానసికవ్యభిచారము ప్రారంభ మగును. తనకుఁ బరిపూర్ణానంద మొసఁగెడి వస్తు వెచ్చట లభించునా ? యని లోకమునంతయుఁ దిరుగుట కారంభింతు రట్టి స్త్రీ పురుషులు. అటుల తిరిగి తిరిగి యనేక దుష్కృత్యము లొనరించి యొనరించి తుదకు వస్త్వంతర నిరపేక్ష మగు రసానుభూతికై కృషి సేయనారంభింతురు. దానికై యితరవస్తువులను వీడి యాత్మానుభవముచేఁ దమకుఁ గావలసిన నిరతిశయానందపదవిని సాధింతురు. అప్పు 'డానందో బ్రహ్మేతి' యను శ్రుత్యర్థమునందలి యాథార్థ్యము గోచరించును. వాల్మీకి యట్టి నిరతిశయానందపదవి నందుటకై యత్నించెడి స్థితప్రజ్ఞులలో నొకఁడు. అందుచేతనే వాల్మీకి యీ తీరున లౌకికరసానుభూతి యంతయుఁ దుచ్ఛ మనియు క్షణిక మనియు శ్రీమద్రామాయణమునందు వర్ణించెను.

శ్లో. సర్వే క్షయాంతా ఉదయాః పతనాంతా స్సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాంతాః మరణాంతం తు జీవితం.
(2-10-16).

కావున రసాభాసమునందుండిగాని విజ్ఞానము కలిగించు నుపాయము కుదురదు. అట్టి విజ్ఞానము సంపాదించుటకు మానవుం డనేకజన్మలయందు సుఖదుఃఖభాజనుఁడై మృత్యువుచే నపహతుఁ డైసంగాని శక్తుఁడు గాఁడని మనకు వాలిరావణాదులచరిత్రము తెలుపుచున్నది. కాని యట్టి స్థితప్రజ్ఞునిగూడ నే తీరున నాఁటి తమసాతీరక్రౌంచమిథునవృత్తాంత మాకర్షించెనో మనము తెలిసికొనినంగాని శ్రీరామచరిత్ర వాల్మీకి వ్రాయుటలోని ప్రధానాశయము మనకు సుబోధముకాదు.

సర్వసాధారణముగ నీ జగంబున రసాభాసమునకుఁ గారణము భ్రాంతి. భ్రాంతి యనఁగా నెట్టిదో కువలయానందకారులగు శ్రీమదప్పయ్యదీక్షితు లీ రీతిని వచించిరి:—

శ్లో. "కవిసమ్మత సాదృశ్యా ద్విషయే పిహితాత్మని
ఆరోప్యమాణానుభవో, యత్ర స భ్రాంతిమాన్ స్మృతః".

ఎప్పుడు మనస్సు విషయస్ఫురణముచే పిహితమై తా ననుభవిం
రసానుభూతికి సదృశ మగు రసానుభవము ద్యోతక మగునో య
సన్ని వేశములందే భ్రాంతి కలుగును. వాల్మీకి యంతవఱకు బ్రహ్మా
దరసానుభవము కలిగి తత్పారవశ్యంబున స్నాన మాచరింప మ
కాంబోలు శిష్యునివద్ద చేలముంగొనికూడ తత్తటస్థవనంబునం బ్రమ
చుండెను! అతనికట్టెదుట సంతతలో నా బ్రహ్మానందాంశలేశ మగు
యానందమునందు నిమగ్న మైన పక్షిమిథునము విహరించుచుండె
కావునం దా ననుభవించెడి రసానుభూతికి సదృశ మగు విషయాన
మాతనిహృదయమందు, దృశ్యసన్నికృష్టత్వముచే నొక విద్యుల్లత
మెఱసి రసభావశబలత నది సాధించెను! బ్రహ్మానందానుభవ
ఘనతరమై సర్వవ్యాపకత్వము నొందియున్నను దానికన్న విష
నందము తత్కాలమునందు మనకు దగ్గఱగా నున్న మన యఱచే
దూరమునం దుండెడి కొండను బిహిత మొనరించినటుల నా ముని
ననమందలి యఖండానందమును మఱుఁగుపఱచెను! అచ్చట నా
చిత్తవిభ్రాంతి కలుగుట కా పఱ కాతనిమానసకాసారమునందు డా
యుండిన కామబీజ మను మత్స్యమే యుత్పతన మొనరించుటచే వా
ప్రశాంతచిత్తమునందు భావతరంగములు లేఁదీసెను! అటుల ప్రశా
తచిత్తము తరంగిత మగుసమయమున నా దృశ్యమునం దాతనికిఁ బూ
స్మృతి జనించెను. అట్టి స్మరణమును రసగంగాధరకర్త యీ తీర
నిరూపించెను.

"సాదృశ్యజ్ఞానోద్బుద్ధ సంస్కార ప్రయోజ్యం స్మరణం".

ఏ నాఁటనో విస్మృత మైన యీ ఋషియొక్క పూర్వానుభవ
క్షిప్తికి వచ్చి యుండలి విషయవాసనాసంస్కార మాతనిమానసమునఁ గ

చెను. సాదృశ్యజ్ఞానమునకుఁ గేవలము తనయట్టి మానవుఁడె యచ్చట
నుండ నగత్యము లేదు. గీతగోవిందమునందు జయదేవుఁడు శ్రీకృష్ణ
పరమాత్మయొక్క విచిత్రాభినివేశముచేఁ గలిగిన సంస్కారస్మృతిని
గేవలఘోర మగు రౌద్రరసానుభూతికాలమందుఁగూడ నా వీరుని
మానసము కలంచిన ట్లీతీరునఁ జమత్కరించెను.

శ్లో. "స ప్రీతిం తనుతాం హరిః కువలయాపీడేన సార్థం రణే
రాధా పీన పయోధర స్మరణకృత్కుంభేన సంభేదవాన్
యత్ర స్విద్యతి మీలతి క్షణమపి క్షిప్రం తదాలోకనాత్
కంస స్యాల మభూ జ్జితం జిత మితి వ్యామోహకోలాహలః".

అతఁడునఁ గువలయాపీడముతోఁ బోరుచున్న శ్రీకృష్ణుని కా గజకుంభ
స్థలమునందు గ్రుద్దుటకుద్యుక్తుఁడగుచుండ నా రాధికావక్షస్థలముస్మృతికి
వచ్చెనఁట ! ఇచ్చట భ్రాంతిచేఁ గలిగిన పూర్వసంస్కారస్మృతి
యా రీతిని కృష్ణునిమానసము కలంచె నని కవి చెప్పుట యుక్తము
కదా ? "సదృశే ధర్మిణి తాదాత్మ్యేన ధర్మ్యంతరప్రకారకో ఽ
నాహార్యో నిశ్చయః సాదృశ్యప్రయోజ్య శ్చమత్కారిప్రకృతే భ్రాంతిః"
యని పండితరాయలు చెప్పెను. కావునఁ దన యనుభవమునకు సదృశ
మగు శబ్ద, స్పర్శ, రూపాదులందుఁ గలిగెడి విలక్షణానుభవమే భ్రాంతికి
మూల మగుటచే నాఋషికి యా పక్షిమిథునముతో "తాదాత్మ్యము
తటస్థించె ననుట చెప్పక తప్పదు. ఇచ్చట 'రస' శబ్దమునకు శృంగారము
నర్థము చెప్పుటచేఁ బరమార్థమున కెట్టి బాధయు లేదు. ఆరీతి తాదా
త్మ్యమే లేనిచో నాతని కంత "శోక" మునకుఁ దగిన కారణము
దురూహ్య మగును. శోక మనఁగా "పుత్రాదివియోగజన్మా వైక్ల
బ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః" యని రసగంగాధరకారుఁడు వచిం
చుటచే నా వాల్మీకి శోకమున క్రౌంచ పక్షి కారణ మనుట పొసఁగదు.
'శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా" యనియుఁ బ్రైఁగ

"శోచన్నేవ ముహుః క్రౌంచీం" అనుటచే జచ్చిన మొగపక్షి నిగూ
శోక, విలపించుచుండిన యాడుపక్షి నాతఁడు తలంచి తలంచి విచా
చుచుండె ననియుఁ జెప్పఁబడుటచే, నాతనియుద్రేక మంతయుఁ గేవ
కరుణారసజన్య మందురా? సర్వసాధారణముగఁ గేవలకరుణారసముచే
గలిగిన యుద్రేకము పెద్దలగు మహాత్ములసందర్శనముచేత చల్లార
మానదు. కాని, కామముచేఁ గలిగిన యుద్రేక మటులు కాదు. 'జ
వంతర్గతమనా భూత్వా శోకపరాయణః' యనుటచే నాతనికిఁ గలిగి
విశ్లేషము మిగుల తీవ్రముగ నుండుటచేతనే బ్రహ్మ సాక్షాత్కరించి
నాతని కా శోకము చల్లారలేదు! వాల్మీకియట్టి యోగి యొక ప
యీ రీతి దుఃఖించె ననుట యసంగతము. ఆ క్రౌంచివలెఁ దన వియో
గముచేఁ దన గృహిణి యగు బోయత యెంతదుఃఖించియుండునో య
యాతనిహృదయ మా క్రౌంచీదుఃఖసందర్శనముచే వ్యథ నొందెన
తన పాపమును బంచుకొనుట కాతనిభార్య నిరాకరించుటచేఁ గలిగి
యావేశమువలన వాల్మీకి తాపసి యయ్యెనే కాని కేవలమానసికప
పాక మొంది వేదాంతార్థసందర్శనముచే నాతఁడు వైరాగ్యమును
దలేదు. అట్టి యుద్రేకముచే నైన యోగులను విషయము లంతల
వీడవు. వసిష్ఠునిపై గోపమువలనఁ దపస్సు నారంభించిన విశ్వామిత్రు
కెన్ని విఘ్నములు కలిగెనో, మేనక యే తీరు నాతని వంచింపఁగ
గెనో మనకు రామాయణమే బోధించుచున్నవి. అందుచే నా వాల్మీ
యొక్క హృద్గతపూర్వానుభవ మాతని నంతలో వీడుట యసంభవము
కాని యాతఁడు దేవక్షత్రియుఁ డగుటచేతను, మహాతపస్వి యగు
చేతను బ్రహ్మసాక్షాత్కరించి యాతని శ్రీమద్రామాయణరచనయం ద
యుత్సాహ మంతయుఁ బర్యవసించునటు లొనరించెను. 'త మువా
తతో బ్రహ్మ ప్రహసన్ మునిపుంగవం". అనుటచే నా మునిపుంగవు
మోహాతిరేకముం గాంచి యా బ్రహ్మ ప్రహసించెను. ఈ తీరున

యర్జునుని మోహము గాంచి శ్రీకృష్ణుఁడు "త ముదాచ హృషీకేశః ప్రహసన్నివ భారత" యని భగవద్గీతయందుఁ బేర్కొనఁబడినది! వాల్మీకిమనోగతవిషయసంస్కారమే యాతనివ్యామోహమునకుఁ గారణ మని బ్రహ్మ కనుఁగొని, 'మచ్ఛందాదేవ తే బ్రహ్మ' న్నని యాతని నోదార్చి "నీ క్షేమముకొఱకే నే నట్లొనరించితి" నని వాక్రుచ్చెను. అంత నా పక్షిసందర్శనజశోకము క్రమక్రమముగ నా శ్లోకార్థచింత నమై తచ్చింతనముం దా మునిహృదయము ప్రవేశించెను. కావున నా శ్లోకము కేవల కరుణారసజన్యముకాక మిక్కుటమగు శృంగారరసావిర్భావముచేఁ గలిగిన యానందమునకు విచ్ఛిత్తిచేఁ గలిగిన శాపవాక్యముగ నుండెను. ఇట్టి శాపవాక్యమె పార్వతి తనరసానుభూతి కాటంకము కలిగించిన దేవతలకును, తన భర్తృకార్య మక్రమముగ ధరించిన ధరణికి నొసంగె నని గంగావతరణఘట్టమునందు శ్రీమద్రామాయణమునందే పేర్కొనఁబడెను. అందుచే, నేను వచించిన రీతిగ రసాభాసానందమునకు విచ్ఛిత్తి కలుగకుండ నుండ దనియు, నందువలన ననేకరసము లుత్పన్న మగుచుండు ననియు నందు ముఖ్యముగ 'కామాత్సంజాయతే క్రోధః' యనుటచే గామమునుండి క్రోధము, దానినుండి మోహము నీ తీరున బయలువెడలు ననియు లోకశాస్త్రానుభవములు చెప్పుచున్నవి. అట్టి రసవిచ్ఛిత్తిచేఁ గలిగిన క్రోధము వాల్మీకియందు స్థాన మగుటచేతను నాతనివాక్యమమోఘ మగుటచేతను నయ్యది దైవనియోగముచే నొక మంగళాశాసన మయ్యెను. దానినుండి శృంగారకరుణారసప్రధానమును, వేదవేదాంతసారభూతము నగు రచన కాతఁ డారంభించి 'కృత్స్నం రామాయణం కావ్య మీదృశైః కరవా ణ్యహ' మ్మని యాతఁ డా శ్లోకార్థచింతముకుఁ గడంగెను! వాల్మీకి తన సుప్రసిద్ధకావ్యమునందు శ్రీరాము నొక యుదాత్తవీరరససంభరితశృంగారనాయకునిగ సాధించుటకును, సీతను కేవలకరుణారసపాత్రముగ నిరూ

# తెలుఁగునందలి వృత్తగంధి గద్యములు

దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ., ఆనర్సు.

ఆధునిక కాలమున గద్య మన్నను వచన మన్నను సమా
ఇవి యొండొంటికి బర్యాయపదములు. ఛందోబద్ధతగాని పా
మముగాని లేకుండ భావప్రకటనకై మాత్రము కూర్పఁబడు వాక్య
నిప్పుడు మన మా పేర్లతోఁ బిల్చుచుందుము. పూర్వ మీ పద
తాళలయానుగుణముగఁ బాడఁదగిన పదపద్యరచనలకుఁగూడఁ
చుండెను. ఇవి మాత్రాచ్ఛందము ననుసరించి నడచుచుఁ బా
బాడుట కనువై యుండుటచే ఛందశ్శాస్త్రమునందేకాక సంగీతశా
ములఁగూడ వీనికి లక్షణము చెప్పఁబడుచుండెను. ఇవి పాదనియమ
కలవి, పాదనియమము లేనివి యని రెండు విధములు. రగడ,
ఉత్కళిక మున్నగునవి పాదనియమసాపేక్షము లైనవి. వీనిని
నప్పుడు వచనమువలెనే యవిచ్ఛిన్నము లైన పంక్తులుగా వ్రాయ
డిరి. క్రీ. శ. 940 ప్రాంతమున నుండిన సోమదేవసూరియశస్తిల
పువులో ద్విరదగతి రగడ యొకటి వచనభేదముగానే ముద్రిత మై
సోమనాథునిపంచప్రకారగద్య నిజమున కుత్కళికారూపమే యై
వచనమువలె వ్రాయఁబడుచుండుట పరిపాటి. కోరుమిల్లి శాసనమ
దలి రగడకూడ నట్లే వ్రాయఁబడినది. అదిగాక వామనుఁడు కా
లంకారసూత్రవృత్తిలో గద్యభేదములలో నొకదాని నుత్కళికాప్ర
మని స్పష్టముగాఁ జెప్పియేయున్నాఁడు. ఇంక వచనములు, గ
మొదలైనవి పాదనియమ నిరపేక్షము లైనవి. కన్నడభాషలో
వేశ్వరాదులను శివభక్తులు పలువురు పెక్కువచనములను రచి
బసవరచితములైన షట్స్థలవచన కాలజ్ఞానవచన మంత్రగోప్య
ములు సుప్రసిద్ధములైనవే. ఇవి పాటలవలెఁ బాడుట కనువుగా
నును. ఇట్లే అక్కమహాదేవి, అల్లమప్రభువు, మోళిగ మా

మున్నగు భక్తులు రచించిన వచనము లెన్నో గలవు. తెలుఁగునఁ గృష్ణ మాచార్యుఁడు క్రీ. శ.1300 ప్రాంతము రచించిన సింహగిరి వచనములు, తాళ్ళపాక పెదతిరుమలాచార్యుఁడు రచించిన (1468-1553) వేంకటేశ్వరవచనములు, ఏగంటివారి వచనములు, చిలుకపాటివారివచనములు మున్నగునట్టివే. అనంతుఁడు ఛందోదర్పణమున వీనినే యిట్లు నిర్వచించినాఁడు.

కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్యలది దాఁ
దెనుఁగుఁ గృతుల వచన మనఁగ దీపించుఁ గడున్.

అన్నమాచార్యుఁడు సంకీర్తన లక్షణమున దీనినే తాళగంధి యని పేర్కొనియుండెను. ఇది గద్యభేదములలోఁ జూర్ణికకు సంబంధించినది గావున దీనికే తాళగంధిచూర్ణిక యని యింకొక పేరు.

నన్నయకుఁ బూర్వము కన్నడమున గద్యపద్య మిశ్రితములైన చంపూకావ్యములు వెలసియుండెను. నన్నయయు నన్నిచోడుఁడును నాపద్ధతి ననుసరించియే తమకావ్యములను గద్యపద్యమయములుగా నొనరించిరి. వారి గద్యములలో వృత్తగంధులు, చూర్ణికలు, ఉత్కళికాప్రాయములుకూడఁ గానిపించును. సరస్వతీకంఠాభరణములో భోజుఁడు "యదాహి అటవీవర్ణనాదౌ గద్యం ప్రగల్భతే" అని యడవి మున్నగువానిని వర్ణించుపట్లఁ బద్యముకంటె గద్యమే యుచితముగా నుండునని చెప్పియుండెను. ప్రాచీనులైన శిష్టకవు లాలంకారిక వచనము ననుసరించి కొన్నివర్ణములను వచనములుగా వ్రాసియుండిరి. తిక్కన మాత్రము

వచనములేకయు వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయము పద్యములన పొం
దుచితంబుగఁ జెప్పుటార్యు లుచితం బనరే.

అని వచనము లేకుండనే నిర్వచనోత్తరరామాయణము రచిం
మొదల నాఁడు భారతమున మాత్రము గద్యపద్య మయమైన చ
పద్ధతినే యవలంబించి మహాకవిత్వదీక్షావిధి నొంది గద్యముల
ములన్ రచియించెదం గృతు' లని చెప్పియుండెను. పాల్కురికి
నాథుఁడు 'అరూఢ గద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భా
రచన, మానుగా సర్వసామాన్యంబుగా' దని యీగద్యపద్యమ
ననే నిరసించి సాంతము ద్విపదచ్ఛందోమయమైన కావ్యములను ర
బూనెను.

ఈ విధముగా నిప్పుడు మనము గద్య మనియు వచన మ
భావించురచనలకును బూర్వులు వ్రాసిన గద్యవచనములకును
భేదము గోచరించుచున్నది. ఇప్పటివచనము విషయప్రధానమై చ
టకుమాత్రమే యనువైనది. పూర్వపువచనము భావవర్ణనా ప్రధా
పాడుటకుఁగూడ ననువై యుండినది. అయ్యు నప్పుడుగూడఁ గేవల
నములుగాఁగాని గద్యములుగాఁగాని వ్రాయఁబడిన రచనలలో గద
నముల కున్నంత గేయతా సౌందర్యము చంపూకావ్యమునందలి
నముల కుండినట్లు తోఁపదు. దీనికిఁ బంచప్రకారగద్య వేంకటేశ్వర
నములు మున్నగు వానియందలి గద్యవచనములకును నన్నయ
నాదులకావ్యములందలి వచనములకును గల భేదమే తార్కాణ
మన పద్యకావ్యములలోఁ గవు లాశ్వాసాంతములందు గద్యలు
కొనుచుందురు. అవి సంస్కృతసమాసభూయిష్ఠములై తాళబద్ధ
పాడుట కనువుగా నున్నట్లు తోఁచును. వీనిని గవులును నితరు
గద్య లనియే యందురుగాని వచనము లని పేర్కొనరు. కాని గ్రం
తర భాగములందలి ఛందోబద్ధములుకాని రచనములకుముందు
మునకు సంక్షేపరూపమైన 'వ' అను నక్షరమే గోచరించుచుం
వీనిని గద్యము లని పేర్కొనుట యరుదు. ఆశ్వాసాంతగద్యల కున్

గేయతా ర్థత లోపలి వచనముల కుండకుండుటయే యీభేదమునకుఁ
కారణమై యుండు నని చెప్పవచ్చును.

గద్యపద్యోభయమైన వాక్యమును 'చంపు' వందు రని దండిము
న్నగు లాక్షణికులు చెప్పినను గన్నడమున నట్టి రచనలకు గద్య లను
ప్రతీతియే కల దని నృపతుంగుఁడు కవిరాజమార్గములలోఁ జెప్పిన
యీపద్యమునుబట్టి తెలియుచున్నది.

మిగె కన్నడ కబ్బంగళా
ళగణిత గుణ గద్యపద్య సమ్మిశ్రిత మం
నిగది సువర్గద్య కథా
ప్రగతియుం తచ్చిరంత నాచార్యర్కాన్.

ఇట్లనుటకు బహుశః గద్యములుకూడ తాళబద్ధములై పద్యములవలె
పాడుటకనువై యుండుటయే కారణమై యుండును. ఈ యాచార
మునఁ గానఁబడుచున్నది. హరిభట్టుత్తర నారసింహపురాణమును
గూర్చియు, లోకేరావు సోమన శివరాత్రిమాహాత్మ్యమునుగూర్చియుఁ
జెప్పునపు డని పద్యగద్యమయకావ్యములే యైనను వచనప్రబంధము
లనియే తెచ్చియుండిరి. ఇప్పుడు కావ్యములలోని గద్యలనుగాని వచ
వచనములనుగాని గేయరీతిని జదువు సంప్రదాయ మరుదైపోయినది.
వాని నిప్పుడు మనము సాధారణవచన భాగములుగానే భావించు
చుందుము.

ఏవాఙ్మయమందైనను వచనముకంటెఁ బదమో పద్యమో
ముందు వెలువడుచుండు ననుమాట సత్యమే. లిపి యేర్పడునంత
వనుక నది జనుల ముఖములందే యుండి క్రమముగా నాభాషయందలి
వాఙ్మయముగా నేర్పడును. తరువాతఁ బదపద్యములతోపాటు వచ
నముగూడ వర్ధిల్లును. ఈ వచనము పండితప్రణీత మగునప్పు డందు
సప్రయత్నముగనో యప్రయత్నముగనో పదపద్యభాగములు చొచ్చు

చుండును. అనఁగా గణబద్ధము కాని వచనమునందు గణబద్ధము
పద్యపాదములుకూడ నక్కడక్కడఁ గనఁబడుచుండును. అట్టి గ
మును వృత్తగంధి యనికాని పద్యగంధి యనికాని చెప్పవచ్చును.

"ఆంధ్రవచన వాఙ్మయమున" వృత్తగంధి కుదాహరణము
భగవద్రామానుజ విరచితమైన వైకుంఠ గద్యమునందలి భాగ
నంగఁబడినది. ఇందు వంశస్థ వృత్తమునందలి రైమొ పూర్తిపాద
లున్నవి. వ్రాఁతలోఁ బదవిభాగము చేయఁబడినదిగాని సంధులు క
వ్రాసినచో దానిని వంశస్థ వృత్తమే యనవచ్చును. నాలుగుపాద
లతో నాఁగక యింకను గొనసాగుటచేఁగాఁబోలు నది గద్యము
బరిగణింపఁబడినది. నన్నయ భారతమునుండి వృత్తగంధి వచనమ
కొనంగఁబడిన యుదాహరణము లన్నియు నాయావచన భాగమ
యారంభభాగములే. మఱియు నందు "నన్నయ వచనమును బ్రా
భించుపట్టుల పద్యమువలెనే నడపించు" నని స్పష్టముగాఁ దెల్పఁ
నది. దీనినిబట్టి వృత్తగంధి వచనము లారంభముననే పద్యగతిని గ్ర
ర్శింపవలెనన తెలియుచున్నది. ఈయఁబడిన యుదాహరణముల
యతి విషయ మంతగాఁ బాటింపఁబడలేదు. ఒక్కగణములుమాత్ర
సరిపోవుచున్నవి. ఉదా"

అని నిశ్చయించి గొంతిని మాద్రినింబాచి
మీరలిందుండి నవయక వాస్తి
పురమునకుం జని

ఇందు మొదటియర్థమునఁ బ్రాస యతి వేయఁబడినది. రెండవయ
మున యతి లేనలేదు. కీ॥ శే॥ గిడుగు
వేంకటరామమూర్తి పంతులుగారు రచించిన ప్రాఁదెనుఁగుఁ గమ
వృత్తగంధి సంప్రదాయముతోనే వ్రాయఁబడినది. ఇందాడినుండి తు
దాఁక నేదోయొక పద్యము పాదము కానఁబడుచునే యుండును. బ

చోట సీసపాదార్థము, తరువాత ద్విపదపాదము, మరల సీసపాదార్థము, మరల ద్విపదపాదము, పిమ్మట వరుసగాఁ గొన్ని ద్విపదపాదములు, అనంతర మొక సీసపాదము, పిదపఁ గొన్ని తేటగీతపాదములు— ఈ విధముగా నాకమ్మ యంతయు సాగినది. కొన్నిచోట్ల యతి నియమము పాటింపఁబడలేదు. కొన్నిచోట్ల నొండు రెండు మాత్ర లధికముగా నున్నవి. ఉదా :—

సిరిదాల్పుచేతఁ దొగి—చిన్నినూడుగ్రలఁ జూచు
తెమఁగు చదువుల రచ్చ తీర్పరులార.

ఇందు మొదటిది సీసపాదార్థము. రెండవది ద్విపదపాదమువలె నున్నది. కాని యొక మాత్ర యధికముగా నున్నది.

అణఁకువమెఱయుచు నాదెపుక్కోలఁది

ఇందు ద్విపదగణము లున్నవి కాని యతి నియమము పాటింపఁబడలేదు.

అక్కున సిగలోనఁ - జొక్కున మోమున
సానుల నెలకొల్పు - మాను దొరలు

ఇందు సీసపద్యపాదము సలక్షణమై యున్నది.

ఇట్లు విూయడుగుయరి సీడనే నిడితిఁ
గై వ్రాలు గిడుగు వేంకట రామమూర్తి.

ఇందు ద్విపదలక్షణము సరిగా నున్నది. ప్రాసలేదు. ఈకమ్మ పద్యము కా దనియు గద్యమే యనియుఁ బంతులుగారే వ్రాసికొని యున్నారు.

ద్వి. ఇక్కమ్మ నుడుల నాయిచ్చమై నేను
గూర్చితి నానాల్క కనువగునట్లు
చదువరి వీనుల కింపెదునట్లు
పద్దెంబు లివి యని పేర్కొన్వ నేను

సీ. పద్యంబు లివియని వ్రాయఁబడి పరికించి

ద్వి. కీడని దూలంగఁ దగ నేరికేని
గద్దె కూర్పుపక్షైనఁ గట్టడివేద
గద్దియకా దీని గడియింపనరుదె.

దీనినిబట్టి వృత్తగంధి గద్యమున నేదో యొక పద్యమునడక యూది
తము గోచరించుచునే యుండవలెను. యతి ప్రాసల నియమము య
సంభవముగాఁ బాటింపఁబడును.

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు శుద్ధాంధ్ర భా
సంగ్రహముఖ పత్రమున

శ్రీరస్తు
శుద్ధాంధ్ర భారతసంగ్రహము
వినుఁడీ
ఇది
చెన్నపురిని మిగుల వాసిని గన్న
కొల్లాసుబ్బరాయలు సెట్టియు
గురుసామి సెట్టియునను

ఇత్యాదిగా నొక సీసపద్యమువ్రాసి యున్నారు. పాదవిభాగ పూర్వ
ముగా వ్రాసినచో నిది సలక్షణమైన సీసపద్యమే యగును.

శ్రీరస్తు శుద్ధాంధ్ర - భారత సంగ్రహ
మువినుఁడీ యిది చెన్న - పురిని మిగుల
వాసినిగన్న కొ - ల్లా సుబ్బరాయలు
సెట్టియు గురుసామి - సెట్టియునను

నిజమైన సీసమే యనవచ్చును. కాని యిది సాధారణముగా నితర
గద్యము వ్రాయుచోట వ్రాయఁబడినది. అంతకంటె దీనిని గద్య వ
టకు వేఱుకారణ మగుపడదు. ఇట్లే కీ॥ శే॥ మహామహోపాధ్యా
కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు బిల్వేశ్వరీయమున

శ్రీ ర స్తు

బిల్వేశ్వరీయము

విషయసూచిక

పీ ఠి క

కథాముఖము

ఇత్యాది నూటొకటిమిది సీసపాదములను చివర నొక తేటగీతి పద్యమును వ్రాసియున్నారు. చివర గీతమున వారే

ఇదియు సప్తోత్తర శతాంఘ్రు లెనసిన యది
సీసమాలిక నాచాత్మ సిద్ధలింగ
మింద నీతేటగీతియె బిందువీర
మిది విషయసూచికయగు బిల్వేశమూర్తి !

యని పైవి నూటొనిమిది సీసపాదము లని సూచించినారు. ఇవన్నియు సర్వలక్షణ సమగ్రములైన సీసపాదములే. వీనినిగూడ సచ్ఛములైన సీసపాదములే యనవచ్చును. వీనిని వృత్తగంధు లనుట కిందలి వస్తువే కారణముకాని వేఱుకారణము లేమియునులేవు.

ఈ విధముగా వృత్తగంధి వచనమున కీఁబడిన యుదాహరణము లన్నియుఁ జద్యపదగంధులుగానే యున్నవిగాని వృత్తగంధులుగా లేవు. ఏలయన నం దిమిడియున్న పాదములలో నొక్కటియు వృత్త పాదములేదు. శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు ఛందస్సాహితీ రీతు లను వ్యాసమున "గద్యను పద్యభాగమువలె వృత్తగంధియై యుండుట యనఁగానేమో సంస్కృత కవితారచనలనుబట్టి తెలిసికొనుట సాధ్య మగునో కాదో, కాని దేశీయము లగు స్త్రీల పాటలు మొదలగువాని లోని కందార్థము లనఁబడునవి వీనిక్రిందఁ జేరవచ్చును. ఇవి ముందు గందాదిపద్యములధోరణి కల్గి తరువాత పాటగా మాఱు చుండుట కలదు. ఈ క్రింది పాటలోని పద్య ముత్పలమాలగా నున్నది.

తెలుఁగునందలి వృత్తగంధి గద్యములు

శ్రీమధురాధరీ వినవె - శేషగిరీశుఁడ నీదు కేళికా
ధామమునందు నింతవడి - దర్పకలీలల నుండి యింత
వేమఱు వేటలాడఁ జని- వేగమె వచ్చితి తల్పుతీయు
భామాసద్గుణాగణా భామా లావణ్యచతురా నీమా
అలమేలుమం

ఇట్టి దేశీయరచనలనుబట్టి యీ విభాగము చేయఁబడినదా య
హము కలుగకమాన" దని వ్రాసియున్నారు. దీనినిబట్టి వృ
యనఁగా బాటలలో ముందేదో వృత్తమునకుఁ జెందిన పాదము
వలెనని తేలుచున్నది.

వామనుఁడు వృత్తగంధిని (పద్యభాగవత్)పద్యభాగవ
నిర్వచించెను. దీనికిఁ బద్యభాగము కల గద్యము వృత్తగంధి య
యర్థము. ఆ పద్యభాగము మొదటనే యుండవలె నని కాని
తము నుండవలె నని కాని యిందుఁ జెప్పఁబడి యుండలేదు.
నెక్కడనైనను రే గణబద్ధములైన పద్యపాతములు గోచరించిన
గద్యము వృత్తగంధి యని చెప్పవచ్చు నని నే నూహించుచు
నన్నయకుఁ బూర్వమునందలి కొన్ని శాసనములలో నీ వి
వృత్తగంధు లని చెప్పఁదగిన వచనములు కొన్ని గోచరించు
మిగిలినవి విషయప్రధానములై యిప్పటి మన వచనములనే
న్నవి. అవి తాళబద్ధములును గావు; పాడుట కనువైనవియుఁ

1. ఎఱకలముత్తురాజు పుణ్యకుమారుని తిప్పలూరి శాసన
పుణ్యకుమారుండు గణ్యమానుండు
ఇది ద్విపదపాదము. ప్రాస యతి వేయబడినది.

2. పుణ్యకుమార చోళమహారాజు రామేశ్వర స్తంభశాసన
విలిపత్తి (క్షితి) కమ్మరి - వినియున ప్రాసె.
ఇదియును ద్విపద పాదమే. యతి సరిగా నున్నది.

3. రెండవమహేంద్రుని బుడ్డిగడ్డ పల్లిశాసనము.

i. శ్రీ ఘుహేన్ద్రిన్మాన రవిమాలు రాపిడుగు.

ఇందుఁ బంచమాత్రాకము లైన నాలుగు గణము లున్నవి. ఇది ద్విరదగతి రగడపాదము. యతిలేదు.

ii. మగడు పుదలి ఏలువాడు కాపిచోళ ముత్తురాజు.

ఇందు నాలుగేసి సూర్యగణములతోఁ (త్రిమాత్రాగణములతో) గూడిన రెండు దళము లున్నవి. తురగవల్గన రగడ పాదము. యతిలేదు.

iii. అచ్చెర్వు గనుపది వరజముం డన్వాడు
దంతియ మంగుతో (ళ్గా) పొడుచిపడియె(న్).

ెంచెము మార్పుతో నిది సీసపద్యపాదమువలెఁ గన్పట్టుచున్నది. యతులులేవు.

4. పుణ్యకుమారుని పొట్లదుర్తిమాలెపాడుశాసనమున ద్విరద గతి రగడగర్భితమై యున్న దని మొదటి పరిశోధన పత్రికలో శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు వ్రాసినారు.

'అణపోతులు రేవణకాలు పుద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్వాఱ ఇశేరేనికిఁ.'

ందుఁ బాదమున కిరువదేసి మాత్ర లున్న వనియు మొదటిపాదమునఁ ాన యతియు (అణ-ద్దణ)రెండవపాదమున సమాక్షరయతియు(ఇ-ఇ) ియఁబడిన వనియు, యతిస్థానములు, సమస్థానములలో నున్న వనియు ారు వ్రాసియున్నారు. ఇం దిరువదేసి మాత్ర లున్నమాట నిజమేకాని ుదేసి మాత్రలకు గణము విఱుగుటలేదు. (ఇచ్చిన పన్నస) గణ ులు తాళానుగుణముగాఁ బంచలఘువులతో లే వని వారే వ్రాసి యున్నారు, ఇట్లు విఱుగకుండుట సంప్రదాయవిరుద్ధము. యతులు మస్థానమున నున్న వని వారు సూచించిరి. మొదటిపాదమున 15

మాత్రల తరువాతను, రెండవపాదమున 13 మాత్రల తరువాత
వేయఁబడినది. లక్షణము ననుసరించి మూఁడవగణము మొదట
యుండవలెను. ఇం దాద్యంతప్రాసలు లేవు. ఈ విధముగా నిం
మాత్రా నియమము తప్ప మ తే ద్విరద గతి లక్షణములు నిం
వచ్చుటలేదు.

5. రేమయ్య శాసనము S. I. I. X. 593.

వక్రంబువచ్చిన వారాణాసియు (వారువా)
శ్రీపర్వతంబు వచ్చి(న)

ఇందు సీసపద్యలక్షణ మున్నది.

6. కొసినేపల్లి శాసనము. S. I. I. X. 598.

i. ప్రభుచోటి రట్టోడి పరహితుఁ డితఁడు.
ఇది ద్విపద పాదము.

ii. కట్టించె కనిక పొం - పట్టంబు హాణులుగ
ఇది సీసపాద పూర్వార్థము.

7. పెద్దముడియం శివాలయ శాసనము. S. I. I. X 611.

దేవస్వంబు లంచముగొన్న వాడు వార
ణాసి వ్రచ్చిన పాపంబు గొన్న వాడు.

యతులు లేవు గాని యివి రెండును తేటగీతి పాదములుగా నున్న
స్వంబు అనుచోట స్వను తేల్చి పలుకవలెను.

8. S. I. I. X 612.

ఏనియు తాఁగొన్న వాడు నిచ్చినవాడు
చెడువాడు క్రొచ్చిన వాడు నెంట.

యతులు లేని సీసపాదము.

9. వెంకయచోడుని కొంగలసాని శాసనములో మహాక్క
ములున్నవని శ్రీ మల్లంపల్లి వెంకటరామయ్యగారు శ్రీ

జతోత్సవ సంచికలో వ్రాసియున్నారు. మహాక్కరలోఁ బాద
మునకు 1 సూర్యగణము 5 ఇంద్రగణములు 1 చంద్రగణము
నుండవలెను. రెండు నాల్గుచోట్ల సూర్యగణమైన రావ
చ్చును. ప్రాస యుండవలెను. యతి నైదవ గణము మొదట.

వెంకయాచోష్ఠ మహరాజు తెంకణాదిత్యుండు
కొమదుర భీముండు పుసి
ఇల్ల దాపజ్మనీ ధర్మమూ చంద్రార్క తారకం
బునువార్ధి లుచునుండు.

గణములు కొంతవఱకు సరిపోవుచున్నవి. మొదటి పాదమునం
ఇంద్రగణమున నొక మాత్ర హెచ్చుగను రెండవపాదమునందలి
గణమున నొక మాత్ర తక్కువగను గనఁబడుచున్నవి. ప్రాస
నాల్గవగణము మొదట వేయఁబడినది. (వెంక-తెంక) లక్షణము
యతి నైదవగణము మొదట నుండవలెను. రెండవపాదమున
లేదు. ప్రాసకూడ లేదు. అందుచే దీనిని మహాక్కర యనుట
నా పాదము లున్న వృత్తగంధివచన మనుట యుచితము.

0. జయసింహవల్లభుని విత్పత్త్రిశాసనము. S. I. I. VI. 585
పద్యమయమువలెఁ గన్పట్టుచున్నది. కాని య ందే పద్య
మున్నదో తెలియుటలేదు.

హతకపుత్రకముని యూ శ్రీశిలావిశాల విపుల.
అనుచోట సీసపాదచ్ఛాయ కనఁబడుచున్నది.

1. బెజఇత్త భటరళ నిల్పినదత్తి
కడల్దల ఇశరయ నిల్పిన గుడియు
కపిలేశ్వరపురపు శాసనము.(శ్రీవేంకటేశ్వర Vol. V. No. 2
పుట 41).

యతిప్రాసలులేని ద్విపదపాదము లివి. కడల్దల అనుచోట
ల్దను దేల్చి పలుకవలెను. (Cf. గొఱల్చియ, గొరగల్గా

12. చాళుక్య భీముని కొఱవిశాసనము.

శ్రీవిక్ర - మాదిత్య - నృపాగ్రత - నయుడైన
చాలుక్య - భీమునకు శౌచకం - దర్పునకు
వేగీశ్వ - రునకురణ - మద్దావ్వ - యకులతిల
కుండైన - కుసుమాయు - ధుఁడుగ - న్నరబల్ల
వరునికి నం - పాప్తమై - నరస మ - ర్దక శ్రీ
మదనభుజ - వీర్యబల - పరాక్రమ - మునదచ్చి
కణియం - గట్టి ప - ట్టంబెత్తి - ఖడ్గ

ఇందైదేసి మాత్రలు గల నాలుగేసి గణము లున్నవి. ద్విపదగతి రగడ పాదము లని చెప్పవచ్చును. మూఁడుపాదములలో యతి సరిపోయినది. ఆద్యంతప్రాసములులేవు.

ii. 'వేగిదేశము విష్ణువర్ధనుతో నడ్డి'
రాజ్యంబుసేయుచున్న కుసుమాయు
ఇది యతిలేని సీసపాదము

iii. చేకొని కొఱవికి - చ్చిన స్థితినిల్ప
ద్విపద పాదము.

పై సూచించిన పద్యము లన్నియు జాతులకుఁ జెందినివే. కాని వృత్తములకు సంబంధించినవి కావు. ఇట్టి వింకను బెక్కుగలవు. కాని జాతు లన్నియు మాత్రాగణబద్ధములే. కావున నందలి గణములు పద్యపాద క్రమమున వచనములోఁగూడఁ గానఁబడుట కవకాశ మున్నది. అందుచేఁ బైపద్యపాదములలోఁ గొన్ని యాదృచ్ఛికములు కావచ్చును.

# 'బహురూపము'

యస్వీ. జోగారావు

భరతమునికాలమునుండి మన దేశమున దశవిధ రూపకములు, తత్రాపి యష్టాదశాధికము లైన యుపరూపకములు, బహువిధ నాట్య ప్రబంధములును బ్రసిద్ధి వడసినవి. కాని "రూపారోపాద్రూపకమ్", "అవస్థానుకృతిర్నాట్య" మ్మను నాభాణకముల యర్థములతో సంవదించునట్లు రూపకధర్మవిశిష్టము లైన నాట్యప్రక్రియ లరుదు. అట్టి వానిలో నగ్రగణ్యము బహురూపము. దీని లక్షణ మిదమిత్థ మని నిరూపించుట కష్టము. నాట్యవిషయికము లైన ప్రసిద్ధలక్షణ గ్రంథములం దెందును దీని ప్రసక్తి గానరాదు. తరతరముల మన వాఙ్మయమున మాత్రము తఱచు దీనిప్రసక్తి గన్పట్టును. అగుచో, ఆంధ్రదేశమునమాత్రమే యిది చిరప్రసిద్ధమైన నాట్యవిశేషముగాఁ బ్రచారము నందినదా యని పించును. ఆంధ్రవాఙ్మయమునుండి యీ బహురూప స్వరూపము నించుక నిరూపించ వచ్చును.

పాల్కురికి సోమనాథుని గ్రంథములనుండి ప్రాచీనాంధ్ర నాట్య సంగీత కళాస్వరూప విశేషము లనేకము మనకు దెలియ వచ్చినవి. అందు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణమున శివరాత్రి జాగరణ వినోదకాలక్షేప ప్రవర్తకులలో

'లలితాంగరస కళాలంకార రేఖ
లల్లవడ బహురూప మాడెడువారు'

పేర్కొనఁబడిరి. ఇట బహురూప మనఁగా నేపథ్య వైవిధ్యమే కాదు, అభినయవైవిధ్యమును సూచింపఁబడినవి. అభినయము-ఆంగిక వాచికాహార్య సాత్త్వికము లని చతుర్విధము. పాల్కురికి పంక్తులలో, అంగశబ్దముచే ఆంగికము, రస శబ్దమున సాత్త్వికము, కళాశబ్దమున గీతి

(పాట) పాడు నప్పుడు కళలు వేయుట పరిపాటి. అనఁగా 'వాచికము,' అలంకార రేఖ యనుటలో 'ఆహార్యము' స్ఫురించును. ఈ యర్థమునే మఱింత విపులముగా, నిపుణముగా నిరూపించినాఁడు పదునాఱవ శతాబ్ద పూర్వార్థమున నుండిన తాళ్లపాక పెదతిరుమలయ్య తన వైరాగ్య వచన మాలికా గీతాలలో *

ధన్యాసి—ఏకతాళి

"సర్వేశ్వరా యవధారు జగంబు నీ నాటకశాల
నేనెత్తిన తొలు జన్మంబుల యాకారంబులు
నీ ముందర నాడెడు బహురూపంబులు
దార సుత బంధుజనులు మేళగాండ్రు
నిన్ను నుతియించు వేదశాస్త్ర పురాణములు
తూర్యత్రయంబు"
మా పాద ప్రచారంబు నాట్యంబు
చేయు చేతలు నాడెడు మాటలు
క్రియాభాషాంగంబులు..." etc

ఇందలి మేళగాండ్రు, తూర్యత్రయము, నాట్యము, క్రియాభాషాంగములు నను మాటలు బహురూప స్వరూపమును బట్టి యిచ్చుచున్నవి. దీనినిబట్టి చూడ బహురూపము సామాన్యమైన నాట్యప్రక్రియల వంటిది గాదు. ఏదో కడు విశిష్టమైనదిగాఁ దోఁపక తప్పదు. ఇట్లు చతుర్విధాభినయమునకు లక్ష్యభూత మగు నిట్టి ప్రక్రియకు, నాటకము (రూపక సామాన్యవాచిగా) తోఁ గల విలక్షణత యెట్టిదో చూడవలసి యున్నది. ఆ విషయము పెదతిరుమలయ్యకు సుమారు మూఁడు శతాబ్దులు ముందుగనే యథావాక్కుల అన్నమయ్య* సూచించియున్నాడు:

* తిరుపతి దేవస్థానము ప్రచురణ (1935)—తాళ్లపాకము వారి రచనలు. సంపుటము 1—లఘుకృతులు, పుట 108.

* సర్వేశ్వర శతకము—ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణ 20 వ పద్యము.

"అమరంగఁ స్ఫుట భక్తి నాటకము భావాంగ క్రియాంగాభి
మ్యముగాఁ జూసిన మెచ్చి పిరారలు వురే యన్నంతకుఁ
మోని గే
హాములఁ రూపులు పన్నుకొంచును నటుండై వచ్చి సంసార ర
గములోనఁ బహురూప మాఁడు వెలయంగా జీవి సర్వేశ్వరా'

నాటకమునందు బహువేషము లుండును. కాని యవి వివిధ నట స్వీకృ
తములు. బహురూపమునఁ బెదతిరుమలయ్యయు, అన్నమయ్యయు
నొక జీవి యొక్క వివిధ జన్మములు లా జీవి బహురూపము లనుటలో,
ఏకనటుని యనేక వేషస్వీకృతిద్యోతమాన మగు చున్నది. అట్లుకానిచో
బహురూపము పేరుప్రక్రియలప్రత్యేకతయే లేదు. అన్నమయ్య నాటక
శబ్దమును నది రూపక సామాన్యవాది యైనను విశేషవాచియైనను,
సాభిప్రాయముగా వాడినాఁడు. నాటకమున 'ఐక్యము' (Unity) అను ప
దొక ముఖ్యధర్మము. ఇట భక్తికి నాటకముతో సాదృశ్యము, అనఁగా
సర్వేశ్వరునితో జీవి కైక్యానుసంధానము ధ్వనితము. ఆ సర్వేశ్వర
భక్తి లేని జన్మము లైక్య విరహిత మగు బహురూపము వంటి వని
సారాంశము. ఇందు నాటకమునందు వలె నిదమిత్థమని యొక యితి
వృత్త ముండ దనుకొందును. బహురూప ప్రదర్శన మొక యనిబద్ధ
కావ్యసంకలనము వంటిది. పూర్వాపరసంబంధానపేక్షము లగు ముక్త
కములు నెత్తి వ్రాయునటు లొకనటుఁడు వివిధ వేషములను ధరించి సామా
జికులకుఁ జమత్కారము గొల్పునట్లు వివిధపాత్రల నభినయింప వలెను.
నిజముగా నదియొక గొప్పనేర్పు. చామరాజు సోమయ్య భరతము*లో
బహురూప ప్రదర్శనము నటుని నేర్పులలో నొకటిగాఁ జెప్పబడినది.
అం దిది కుండలిదండలాస్య విలాసములతోపాటు దేశినాట్య విశేష

* వ్రబంధరత్నావళి—శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము.
పుట 143—487 వ పద్యము,

ముగాఁ జేర్కొనఁబడినది. హరిభట్టు * (క్రీ. శ. 1500 ప్రాంతము) 
సింహ పురాణమున (1—213) భృంగీశ్వరుని నాట్యమును "...మ
కుండలి దేశ్యుద్ధత బహురూప విలాసంబు లనం బరగు షడ్విధంబు
బరిగణించినాఁడు. అతనికి మిగుల నర్వాచీనుఁడగు అయ్యలరాజు నా
యణకవి హంసవింశతిలో (V—122) బహురూపమును షోడశ విధ
లగు నృత్తములలో నొకటిగాఁ జెప్పెను. నారాయణకవినాఁటి కాయ
విధములు పదునాఱుగాఁ బెంపుచెందవచ్చు నను బహురూపము న
మాత్రి మెట్లగును? నృత్త మనఁగా శారదాతనయ విద్యానాథాదు
కొలఁదిమందిమతముననోతప్ప ధనంజయ చతురదామోదర
బహుపూర్వార్వాచీన లాక్షణికులమతమునఁ దాళలయాశ్రిత
మాత్ర మనియే. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును శమ భరతకో
మున "దేశీనృత్తమ్- నానావేషధరం యత్తద్బహురూప మితీరిత
మ్మనియే నిర్వచించిరి. పోనీ, అయ్యలరాజువారి మాటలోఁగాని, మా
రా. కవిగారి మాటలోఁ గాని యచ్చుపోరపా టేమైన నుండుననుకొం
మన్న నచట శబ్దము నృత్తమునకు బదులు నృత్యము గావలెను. నృ
లక్షణము చూచిన భావాశ్రయ మగు ఆంగికాభినయము మాత్ర
అదనము. బహురూప విషయమున నదియు నపర్యాప్తమే. అది చ
ర్విధాభినయవిశిష్టము కావున నాట్య నిర్వచనమే వర్తించును. *

---

* ఆంధ్రుఁడు, పదునాఱవ శతాబ్ది యుత్తరార్ధమున నుండినవాఁడు నగు చ
దామోదర పండితుఁడు తన సంగీతదర్పణము (తంజావూరు సరస్వతీ మహలు ప్ర
రణ, 1952) గ్రంథారంభమున "భరతాదిమతం సర్వం ఆలోడ్యాతిప్రియస్న
శ్రీమతా హరిభక్తేన సజ్జనానంద హేతునా ప్రిచరద్రూప సంగీత సారోద్ధార
యతే" అను శ్లోకమునఁ జేర్కొనిన హరిభట్టు కూఁడే యయినచో మన కా
మాట అవశ్యము ప్రమాణము.

* సంగీత దర్పణము సప్తమాధ్యాయమున నృత్త నృత్య నాట్య లక్షణ
త్తిట్లు నిర్వచింపఁబడినవి:—

ఎడపాటి ఎఱ్ఱన తన మల్హణచరిత్ర ద్వితీయాశ్వాసమున "చారణ బాగడ చర్చరీ బహురూప దండలాసాదిక భాండికములు" అని బహురూపము నొక భాండికముగాఁ బరిగణించెను. నారాయణకవి పరిగణనమున బహురూప భాండికములు భిన్నములుగా నున్నవి. అట భాండికమును బహురూపమువలె నా పకునాతింట నొకటి. భాండిక శబ్దమున కనేకార్థములు గలవు—అనుకరణ (Mimicry), పరిహాసము (Buffoonery) etc., అనుకరణ మన్నది సర్వనాట్య సామాన్యమైనది. బహురూపమున బహుధా యుండును. అందుచే, ఎఱ్ఱనభాండికమున కా యర్థము, నారాయణకవి భాండికమున కన్యార్థమును జెప్పవలెను.

బహురూప మనఁగా కొందఱేకపాత్రాభినయము (Mono-action) అయి యుండునని భావించుచున్నారు. అది యథార్థమే కాని యంత మాత్రమే కాదు; రూపారోపణము గూడ నుండవలెను. ఏకపాత్రాభినయ మనఁగా, ఒక్క యనుకర్త వివిధానుకార్యులకుఁ, బాత్రమై యభినయించుట. ప్రాయికముగా హరికథా కాలక్షేపములలో హరిదాసులు చేయునది యేకపాత్రాభినయమే. అట రూపారోపణము లేదు.

---

నృత్తము:

"గాత్రవిక్షేపమాత్రన్తు సర్వాభినయవర్జితమ్
అంగికోక్త ప్రకారేణ నృత్తం నృత్తవిదో విదుః॥
నృత్తం తత్కథితం తద్జ్ఞై రరహీనం సుఖేకకమ్
కేవలం తత్ప్రయోక్తవ్యం నృత్తం తాళలయాశ్రితమ్॥"

నృత్యము:

"అంగికాభినయై రేవ భావానేవ వ్యనక్తి యత్
తన్నృత్యం మార్గ శబ్దేన ప్రసిద్ధం నృత్యవేదినామ్॥"

నాట్యము:

"చతుర్థాభినయోపేతం నాట్య ముక్తం మనీషిభిః"

కాని బహురూపమున నది విధాయకము గదా. అట్టిచో నర్ధనారీశ్వర
నరసింహావతారాది వేషములు వేయు పగటి భాగవతులను బహురూ
పదర్శకు లనవచ్చునేమో! అసలు బహురూప మనఁగా ఊసరవెల్లి
యని కదా యర్థము!

## బహురూపము—(పరిశిష్ట భాగము)

తొలుత బహురూపము తెలుగు దేశమునకు మాత్రమే చెం
నదా యని యనుకొంటిని. కాని మిస్టర్ ఎఫ్. కిట్టెలు తన కర్ణాటాం
నిఘంటువులో బహురూపమునకు 'Theatrical representation' అ
నర్థ మిచ్చి యది మైసూరు, మహారాష్ట్రములందుఁ బ్రచారమున నుం
నట్లు సూచించినాఁడు. హిందీ శబ్దసాగరమున బహురూపము

"ताण्डव नृत्य का एक भेद जिसमे अनेक प्रकार के रूप धारण
करके नाचते हैं।

అనియుదాహృతము. అనఁగా నానావిధ రూపధారణముతోఁ బ్రయోగింప
బడు తాండవ నృత్య ప్రభేద మని. తాండవ మనఁగా 'ఉద్ధత ప్రాయ
ప్రయోగము' (శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము) అనగా నిది పురుష
లకుఁ దప్ప స్త్రీలకు నిరవకాశ మైన దని తేలుచున్నది. కిట్టెలు 'బహు
రూపిణి' యను శబ్ద ముదాహరించి దానికి నట్టువకత్తె యను సామా
న్యార్థ మిచ్చియు వెనువెంటనే కోలాటకత్తె యని చతురాస్య నిఘం
ట్వధికారమును జేర్చెను. ఈ బహురూపమునకు దానికి నంబంధము
లేదు. హిందీ శబ్దసాగరమున 'బహురూపీ' లేక 'బహురూపియా' అ
పుంలింగ వాచకము మాత్రమే ఉదాహరింపఁబడి,

अनेक प्रकार के रूप धारण करने वाला। नकल बनाने वाला।
वह जो तरह तरह के रूप बना कर अपनी जीविका करता है।

